శ్రీరస్తు.

# విజ్ఞప్తి

మహాశయులారా!

నేటికి సుమారు రెండువందల సంవత్సరములకు పూర్వుడగు మాటూరు వెంకటేశంగారు (1. బుధమనోల్లాస శతకము 2. రామాజానకీనాయకా అనుశతకము 3. మాటురివాస శతకము 4. మాటురి చన్నకేశవశతకము 5. రాయపట్న పురవాస వేణుగోపాలదేవ యను నీయైదు శతకములను రచియించిరి.) యీశతకములు కేవల భక్తిరస ప్రాధాన్యముగా తేట తెలుగున యొప్పారుచున్నయవి. వీటినిమా పెద్దలు తిరిగి ప్రతులుగా వ్రాయుటచే కొంత శైథిల్య మొందుటయు నక్కడక్కడ పదస్ఫూర్త్యాదిలోపములు జరుగుటచే తిరిగి యొనగూర్చిన శ్రీమాన్ శేషాద్రి వెంకటకవిగారికిని, యీ పుస్తకముల పరిచూచిన శ్రీమాన్ కోర్గొండబట్టరు వెంకట కృష్ణమాచార్యులవారికిని, మ॥ రా॥ శ్రీ॥ మాటూరి లక్ష్మీనృసింహారావు గారికిని నాకృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాడను.

ప్రస్తుతము (1 రామాజానకీనాయకా 2 మాటురివాస) అను నీరెండుశతకముల నచ్చొత్తింప గలందులకు

బీదవాఁడవగు నన్ను ప్రోత్సహించి కొంతసహాయమొనరించిన బ్ర॥ శ్రీ॥ వే॥ అంబడిపూడి రామకృష్ణశాస్త్రులవారికిని, మ॥ రా॥ శ్రీ॥ పరిటాల వెంకటేశ్వరావు పంతులుగారికిని, యనేక నమస్కారము లొనరించుచు ముద్రణకొఱకు సహాయమొనరించిన చందాదారులపేరులను యీగ్రంథాంతమున బొందుపరచినాఁడను.

చిత్తగించగలరు.

ఇట్లు,

మాటూరు,<br>ది 1—9—32.

మాటూరు అప్పారావు, ఏతత్కృతి<br>పితృఁడగు (భూరిగుణజాలశతక<br>మొనరించిన) వెంకటప్పయ్య<br>కవిగారి పౌత్రుఁడు.



# చందా నొసగిన వారి వివరము.

5-0-0 మ. రా. శ్రీ. పరిటాల వెంకటేశ్వర రావు దొరగా
5-0-0 ,, అంబడిపూడి రామకృష్ణశాస్త్రిగారు
5-0-0 ,, మాటూరు రామకిషన్‌రావుగారు
5-0-0 ,, మాటూరు నారాయణరావుగారు
5-0-0 ,, కపిలవాయి రామయ్యగారు
1-0-0 ,, తుక్కా రామరావుపంతులుగారు
2-0-0 ,, బుద్ధిరాజు కృష్ణమూర్తిగారు
2-0-0 ,, అబుదుల్ రహిమాన్ ఇబ్రాహింసాహెబుగార

2-0-0 ఠాకురు చంద్రభాన్ శింగుగారు
3-0-0 మ. రా. శ్రీ. పుట్టా వెంకటప్పయ్యగారు
2-0-0 ,, మహమ్మదు గాలబుసాహెబుగారు
1-0-0 ,, హసన్ మహమ్మదుసాహెబుగారు
1-0-0 ,, పల్లె నర్సయ్యగారు
1-0-0 ,, షేఖు మీరాన్ సాహెబుగారు
1-0-0 ,, పువ్వుల వెంకటనారాయణగారు
1-0-0 ,, గం॥ దేవవజిసం రమణమ్మగారు
2-0-0 ,, మ. రా. శ్రీ. మాటూరులక్ష్మీనర్సింహ రావుగా

1-0-0 ,, మాటూరు సుబ్బారావుగారు
1-0-0 ,, దూపకుంట్ల శ్రీరామమూర్తిగారు

శ్రీరస్తు

# జానకీ నాయక శతకము

శా. శ్రీరామా రవివంశజా రఘుపతీ సీతేశ శ్రీరాఘవా।
తారేశాయుతసార చారువదనా దాక్షిణ్యరత్నాకరా।
మారీచాదిసమస్తదైత్యహరణా మార్తాండకోటిప్రభా।
మారారి ప్రముఖామరాళినుత రామా జానకీనాయకా.

శా. రామా! రామ ! కృపాసముద్ర! రఘువీరా! ధారుణీవ
ల్లభా । సోమాబ్జప్రియకోటితేజ! రవివంశోద్ధార! శ్రీరా
ఘవా । శ్రీమాటూరిపురీశ! కృష్ణ! కమలాచిత్తాబ్జభృం
గంబయి । మ్మా మా కోరిక లన్నియున్నిపుడు రామా!
జానకీనాయకా. ౨

మ. నినువర్ణింపఁగ నెంతవాఁడ మదిలో నీపాదపద్మంబులే ।
ననిశంబున్నతభక్తితోఁ దలఁతు నాయందుంగృపం జూప
వే । నిను వర్ణింపగ శక్తిహీనుడను నా నేర్పేర్పడఁ బ
ద్యముల్ । మనసొప్పఁ రచియించి నీ కిడుదు రామా
జానకీనాయకా. ౩

మ. చదువుల్మిక్కిలి నేర్వలేదు జపముల్ సల్పంగ నేనేర నీ ।
పదపద్మంబులు నమ్మినాఁడ మదిలో పాపఘ్న సర్వేశ నా।
రదమౌనిస్తుత రామ భూరమణ రారా యంచుఁ గీర్తిం
తు స । మ్మదముంబొందుచు నన్నుగావు మిఁక రామా
జానకీనాయకా. ౪

మ. కరినింబ్రోచినభంగి నింద్రతనయుం గన్గొన్నచందంబునన్ । మఱియాద్రౌపదిగాచురీతి ధ్రువు సన్మానించుభావంబునన్ । గుఱిగా భీష్మునిజూచుపోలిక ననుం గూడం గృపంజూడవే। మరియాదల్పనకుండ భక్తునెడ రామా జానకీనాయకా. ౫

మ. సిరులన్ నమ్మఁగలేదు, భూమిపతులన్ సేవింపబోలేదు ని । న్నెఱుఁగన్ నేరని దుష్టమానవులతో నింపెంతగావచ్చినన్ । మురియన్ లేదు, సమస్తభంగులను నిన్నున్ నమ్మి నీనామసం । స్మరణన్ జేసెద గావవే దయను రామా జానకీనాయకా. ౬

మ. మదిలో నిన్నుదలంచియున్ శరణనన్ మన్నించుచందంబులున్ । విదితంబై బహుశాస్త్రముల్దెలుపఁగా వేమాఱు నిన్వేఁడినన్ । సదయత్వంబున బ్రోవవేమియిఁక దోసం బెంతయుం జేసినన్ । మదిలో నీవనినమ్మియుంటిఁగద రామా జానకీనాయకా. ౭

మ. కరుణన్ గావవదేమి భక్తునియెడన్ కౌటిల్యమింతేటికిన్। శరణన్నంతనె శత్రుసోదరున కాచంద్రార్కమానట్టియా । వర మేలాగున నిచ్చితో, కపటక్రవ్యాదేశునెట్లోమితో । మఱవుల్ నాయెడగల్గెనా యిపుడు రామా జానకీనాయకా. ౮

[illegible]. నినునేఁగొల్చెదనంటి నీచరణముల్ నేనమ్మినానంటి నా। విన రొక్తుల్వినుమంటి దోసముల నుర్విన్ మాపుమంటిన్ వరం । బనిశంబీమనియంటి, నిన్ విడచి దేవా యన్యునే

వింప నా । మనముం బాయక నిల్వుమంటిఁగద రామా
జానకీనాయకా. ౯

మ. మఱువంబోకు పరాకుగాకు వరమిమ్మా నాకు నే దైవ
మున్ । సరిగా రెన్నఁగ నీకు, నీగుణకథల్ సల్పంగఁ బోబోకు
నా । మొఱయాలించుట గొప్ప నీకు, నదియే మాయంటి
వానాఁడు నీ । మరియాదల్పనకుండనుండుఁగద రామా
జానకీనాయకా. ౧౦

మ. మిము నేనమ్మినవాఁడ నాయెడను స్వామీ మున్ను ప్ర
హ్లాదునిన్ । విమలాత్ముండగు నవ్విభీషణుని దేవేంద్రా
త్మజున్ ద్రౌపదిన్ । ప్రమదంబిచ్చుచుఁ బ్రోచినట్లు నను
సంభావింపు కారుణ్యతన్ । మమకారంబులు వాసి గొ
ల్చెదను రామా జానకీనాయకా. ౧౧

మ. అహిశయ్యంబవళించుచున్ గరుడవాహారూఢిచే నొప్పు
చున్ । దహనజ్వాలలమించు చక్రమరచేతన్ బట్టి దై
త్యేశులన్ । బహుభంగిన్, దునుమాడి సర్వజగముల్
బాలింతువేవేళ నీ । మహిమంబుల్గొనియాడ నావశమె
రామా జానకీనాయకా. ౧౨

—* దశావతారములు. *—

మ. నిగమంబుల్గొనిపోవు సోమకునితో నీవంబుధిన్ జొచ్చి న
త్వగతిన్ వానివధించి వేదచయముల్ వాణీశు కిప్పింప
వే । పగసాధించి, మహాత్మ యచ్యుత పరబ్రహ్మంబవై
నట్టి నీ । దగు మీనాకృతి కేను, మ్రొక్కెదను రామా
జానకీనాయకా. ౧౩

శా. దేవానీకము రాక్షసు ల్బలిమిచే ధీరాత్ములై మంథర। గ్రావంబు, న్బకలించి పాలకడలిన్ గవ్వంబుగాఁద్రచ్చి నన్। భావంబుల్బెడి లోకముల్ భయపడన్ బాలించి కూర్మంబవై। మావక్షస్థలి నిల్పవే గరిమ రామా జానకీనాయకా. ౧౪

మ. కనకాక్షుండు వరప్రభావపటిమన్ గర్వాంధుడై భూమిఁ దాఁ। గొని, వారాశినిడాగియున్నయపుడున్, క్రోడ స్వరూపంబునన్। దనుజాధీశునిద్రుంచి యొప్పటిగతిన్ ధాత్రిన్ దగన్ నిల్పవే। మనుజాహారకులాటవీదహన రామా జానకీనాయకా. ౧౫

శా. నరసింహాకృతి నుక్కుకంబమునజన్మంబాచు నత్యుగ్రతన్। కరయుగ్మంబునఁబట్టి హేమకశిపున్ ఖండించి శాంతుండవై।హరబ్రహ్మాదులు మౌనిబృందములునిన్నాత్మన్ బ్రశంసింపఁగా। మఱి బ్రహ్లాదుని గాచి తీవెకద రామా జానకీనాయకా. ౧౬

మ. మరుగుజ్జుండవునై వటుండవగుచున్ మాధుర్యవాక్యంబులం। దరికిన్ మెప్పువహింపఁ బల్కుచు బలిన్ దానంబు మూడడ్గులున్। బరగన్వేఁడి గ్రహించిభూమి నభముల్ పాదద్వయింగప్పి క్ర। మ్మర పాదంబున దైత్యు ద్రొక్కితివి రామా జానకీనాయకా. ౧౭

మ జనకున్ జంపిన కోపవహ్ని దనరన్ శశ్వత్కుఠారంబుచే జనలోకేశుల నిర్వదొక్కతడవల్ సంధించి వేవేగమే। యనిలో రూపులు మాపి కశ్యపునకున్ జ్యాదానమున్

జేయవే । మనసోత్సాహముతోడ నిందలఁతు రామా
జానకీనాయకా. ౧౮

మ. మొదటం దాటకిఁద్రుంచి మౌనిసవనంబుంగాచి గౌరీశు
వి । ల్లదియంతన్ దునుమాడి భూసుతవివాహంబాచు
బిత్రాజ్ఞచే । ముదమొప్ప న్వనభూమి కేగి జగముల్మోదింప
గారావణున్ । మదిలో భీతిలఁగూల్చవే ధరణి రామా
జానకీనాయకా. ౧౯

మ. బలరామాఖ్యుఁడవై హలాయుధమునం బల్మాఱుదైత్యే
శులం । దలలన్ ద్రుంచి ప్రతాపమొప్పఖలులందండించి
శిష్టావనం । బిలఁ బ్రఖ్యాతిగసల్పి ధర్మములు పెంపే
ర్పాటుగానిల్పి ని । ర్మలకీర్తిన్ విలసిల్లి తీవెకద రామా
జానకీనాయకా. ౨౦

మ. పురముల్మూఁడుజయింపఁగాఁ దలఁచియున్ బుద్ధుండవై
నేర్పుతోఁ । బురకాంతల్ వ్రతభంగమౌనటుల సంబోధింప
గౌరీశుడున్ । శరవహ్నిందహియింపఁ డాపురములన్
సర్వాత్మనీమాయ నీ । మరుఁగెవ్వండెఱుఁగంగశక్తుఁడగు
రామా జానకీనాయకా. ౨౧

మ. కలవేళన్ నృపులందఱుంగుమతులై గర్వాంధులై తుచ్ఛు
లై । ఖలులై ధర్మవిహీనులై పరగుచున్ గౌటిల్యతన్
బూనఁగాఁ । గలికాఖ్యన్ జనియించి వారి నపుడున్
ఖండించి సద్ధర్మముల్ । మలినంబు ల్వీడఁగొట్టి నిల్పెదవు
రామా జానకీనాయకా. ౨౨

శా. శ్రీసీతాపతి రాఘవేంద్ర కరుణాసింధుండసత్యవ్రతా
నీసాటెవ్వరులేరటంచు మదిలోనిక్కంబుగా నమ్మితిన్

నేసేవించెద నీపదాబ్జయుగళిన్ వేమారునెల్లప్పుడున్ ।మా
సామీ నన్ను బ్రోవ నీకెతగు రామా జానకీనాయకా. ౧౩

శా. నేనీదాసుడనంటి నాకు వరముల్ నీవిమ్మటంటింజుమీ
మీనామంబుతలంతునంటి దయతో మేలీయవేయంటి ని।
న్నే నాబుద్ధిని నమ్మియుంటి కృపతోన్ నీకన్న లేరంటి
రమా । మానాధా ననునేలుమంటిగద రామా జానకీ
నాయకా. ౧౪

మ. కరుణాసింధుడవండ్రు నిన్ను నది నిక్కంబంచు నేనమ్మి
నీ । చరణంబుల్మదిజేర్చి వేడితిని లేశంబైన దాక్షిణ్య
మ్మున్ । బొరయన్ జేయ వికేమిచేయవలయున్ పుణ్యా
త్మ నేనెవ్వనిన్। మరువ న్నీపదపద్మము ల్మదిని రామా
జానకీనాయకా. ౧౫

శా. మిమ్మెన్నంగవశంబె ధాతకయినన్ మీపాదపద్మంబు
లన్ । నెమ్మింబుట్టియు లోకపావనియనన్ నీపుత్రి గంగా
నదిన్ । సమ్మోదంబున దా తరింప హరుడున్ చక్కం
దలం దాల్చడే । మమ్మున్ బ్రోవగ నీవ యింకెవరు
రామా జానకీనాయకా. ౧౬

మ. శితికంఠుండు సహస్రనామములలో శ్రీరామనామంబు ను
న్నతభక్తిన్ జపియించువారికి మహానందంబు శోభిల్లు స।
ద్గతికిన్ మూలమటంచు గౌరికిని మంత్రం బంతయుంజెప్పె
నా । మతి నీమంత్రరహస్యమున్ దలతు రామా జానకీ
నాయకా. ౧౭

శా. రారా రాఘవ రామచంద్ర కరుణన్ రంజిల్ల నన్నేలరా
రారా జానకిప్రాణనాథ రఘువీరా నీవె నాదిక్కురా ।

రారా నీదయకేను పాత్రుఁడను రా రావయ్య నన్ప్రోవగా।
మారాకార సహస్రశీర్షకృప రామా జానకీనాయకా.

మ. హరబ్రహ్మాదులు మౌనిబృందములు నిన్నాత్మన్నిరూపింప లే। కెరుగంజాలక చిత్ప్రకాశుఁడవు లోకేశుండ వంచున్ ననము। సకారణంబుల్గ జేసి కాంచిరిగదా సర్వంబు నీవంచు ని। న్మది నేభంగిని గానగావశమె రామా జానకీనాయకా. ౨౯

శా॥ గౌరీనాయక చాపఖండన త్రిలోకారాధ్య దైత్యాంతకా। పారావార విహారశత్రుభయదా పాపఘ్న భక్తప్రియా వీరాగ్రేసర రాఘవేశ హరి గోవిందా ననుఁ గావవే। మారెన్నంగను లేరు నీసమము రామా జానకీనాయకా.

మ. బలగర్వాంధుని దానశీలుని బలిన్ బంధింపవే పొట్టివై బలిమిన్ జంపవె రాజులన్ పరశుచే పారుండవై యుగ్రతన్। ఖలుఁడౌ రావణుఁద్రుంపవే, యవనిజాకాంతుడవై దేవ ని। ర్మలకీర్తుల్ప్రభవింప జేసితివి రామా జానకీనాయకా. ౩౦

మ. నరమాంసాశనసంఘము ల్దివిజులన్ దండించి దుష్టాత్ములై। పరగన్ వారిని బల్మిచే దునుముచున్ పద్మాక్ష దేవావళిం। గరుణం బ్రోచితివీవె కావె సుగుణా కారుణ్యవారాసి నీ। మరుగుం జొచ్చినవారి కేకొదువ రామా జానకీనాయకా. ౩౧

శా. ఏ నీదాసుఁడ నీవు నాదొరవు యింకెవ్వారి నింగొల్తు ని। న్నే నా యాత్మఁదలంచువాఁడ నిక నా నేరంబులెన్నేని యున్

గానఁ బచ్చిన గావగాద గురమాకాంతా! భవత్సేవనే। మా
నన్గష్టములెన్నివచ్చినను రామా జానకీనాయకా. ౬౩

మ. స్థిరబుద్ధిఁ నినునాశ్రయించి యెపుడుఁ జిద్వ్యాపసర్వేశ
యీ। శ్వర నారాయణ యిందిరారమణ దేవాభక్త
సంరక్షణా। పరమాత్మా మునికోటిపూజిత పరబ్రహ్మం
బవంచుఁ మదిఁ। స్మరణల్ సల్పెదయిమ్ముసద్గతిని రామా
జానకీనాయకా. ౬౪

శా. శ్రీరామా రఘురామరామయని నే సేవింతునీపాదముల్
నీరూపెన్నగజాల గాన దయతో నీవే ప్రసన్నుండవై।
రారా యేమిభయంబురా యనుచు ధారాళంబుగా బల్క
వే। మారుంజెప్పక నిన్నుఁ జేరెదను రామాజానకీనాయకా॥

మ. పదునాల్గా భువనంబులుఁ సుఖరతిం బాటిల్లనీబొజ్జలో
మొదలఁ నీవుధరించి కాచెదవు స్వామీ నీకు దాసుండనీ।
బదులేతేరని భర్తవీవె యనుచుం భక్తిఁ మృదంగధ్వనిఁ
మదమాతంగము నెక్కిసాటెదను రామా జానకీనాయకా.

మ. గురువుల్ శిష్యులఁ గానవచ్చి స్వపదాంగుష్ఠంబులుఁ
గన్నులుం। బొరయం బ్రొముక్కమనంగవచ్చు శిరముల్
బూజించి మాకానుకల్। దలచిమ్మంచనవచ్చుగాని మరి
యాత్మఁ నిన్ను నీమాయ నీ। మరుగు ల్గానగలేరు
పండితులు రామా జానకీనాయకా. ౬౭

మ. సతతంబుఁ ఘనవిద్యలుఁ జదువుచుఁ శాస్త్రంబులుం
జూచుచుఁ। ప్రతిపాదించుచు తత్వమార్గరచనల్ భాషించి
బ్రహ్మంబుగాం। చితిమంచుఁ రుచిపుట్టగా సభలలో

చెప్పంగనేకానిదా। మతినిర్జించిన సౌఖ్యములున్నదరు రామా
జానకీనాయకా. ౩౮

మ. పరమంబైన భవత్కథానుతుల సద్భావంబు పద్యంబు
లన్ । దరుచైతప్పలునున్న పుణ్యా మరచేతంగాంతు
రెట్లన్నన్ । మరయంచున్ దపమాచరింపు మెరుకన్
మన్నించి మేలియ్యవా । మరువన్ బోకుము యిట్టిచంద
ములు రామా జానకీనాయకా. ౩౯

మ. శ్రీకంఠుం డరచేతిపున్కవిడిచెన్ శ్రీదేవిభిక్షంబిడన్
శ్రీకంఠుండుమహేశ్వరాఖ్యదనరెన్ సేవించి నీదాసుడై
శ్రీకంఠుండు దహించె యా త్రిపురముల్ శీఘ్రంబు నీ
ప్రాపునన్ । మా కింకేమిభయంబు నిన్గొలువ రామా
జానకీనాయకా. ౪౦

మ. ఘనతన్ జెందిరి నీదునామపఠనన్ గౌరీశ వాణీశులున్ ।
మునులున్ తారకనామజప్యమున నిన్నున్ నీపదాబ్జంబు
లున్ । గనియుత్కృష్టమహాత్ములైరి నిను వేడ్కన్ గొల్చి
నన్ పాపము । ల్మనునే పోవునుకాక భస్మమయి రామా
జానకీనాయకా. ౪౧

మ. కదలన్ బోకను వేయునోళ్ళ నహిలోకస్వామి మిమ్మె
ర్పడన్ । తుదిముట్టన్ నుతియింపలేక నిగిడెన్ దోషఘ్న
నిన్నింక నా । మదిసంస్తుత్యముచేయగావశమె నే మం
దుండ నజ్ఞానుడన్ । మది నేనొక్కటిగంటి మీ శరణు
రామా జానకీనాయకా. ౪౨

మ. వగనైనన్ వగనైన ప్రాణభయ మాపాదింపగానైన నీ।
దగునామంబు దలంచువారికి యథార్థంబైన పుణ్యంబు

లుం । నిగమస్తుత్య లభించు నన్న వలుకుల్ నిక్కంబదె
ట్లన్న న । మ్మగఘుంటాశ్రవుబ్రోచినట్లరయ రామా జా
నకీనాయకా. ౪౩

మ. జయరామా హరి వాసుదేవ గజరాట్సంత్రాసవి
చ్ఛేదనా । నియతాత్మా యహిశాయి కృష్ణ వరదా ని
త్యాండ లోకేశ శ్రీ । దయితాంచిత్రసరోజభృంగమధుదై
త్యధ్వంసనసర్వేశ్వరా । మయపుత్రీధవకంఠనిర్దళన రామా
జానకీనాయకా. ౪౪

మ. చనునే నామొరయాలకించక వృథాజాడ్యంబునుం జేయ
గా । వినుమీభక్తులతోటివాడ నగుదున్ వేరున్నదే నా
యెడన్ । అనఘా నన్నుతరింపజేయు మిక నీ కాత్మ్మం
డ దాసుండనై । మనుచున్ నిన్ను స్మరించుచుండెదను
రామా జానకీనాయకా. ౪౫

శా. స్వామీ నీవు పరాకుగాక వినుమీ స్వాంతంబు రంజిల్ల
గా । నామాటల్ భవదీయదాసుడనుగానన్ ప్రేమచే
దేవ దే । నా మానాయక నిన్నునమ్మితిని నీవాడన్ ననుం
గాచి యి । మ్మామోక్షంబు మదీయవాంఛయిదె
రామా. ౪౬

మ. మదిలో నిన్నుదలంచి వేడుకొని యేమంటిం దయాసా
గరా । విదురుండాడినభంగి నేనడిగితిన్ వేడ్కన్ వరం
బిచ్చుటల్ । యిదినీకున్ సహజంబకాదె దయతో యి
ష్టంబులన్ దీర్చి నా । మదికిన్ సంతసమంద జేయగదె
రామా జానకీనాయకా. ౪౭

మ. కరినీకేమిడియుండెనాఁడు చెపుమా ఘంటాశ్రవుండేమ
నెఁ। శరతల్పుండగు భీష్ముఁడేమియొసఁగెఁ సద్భక్తియుఁ
దప్పనీ। శరణుంజొచ్చినయావిభీషణుఁడు యేసంబంధియో
నీకు నీ।మరుగుల్ నీవలపక్షము ద్దెలిసె రామా జానకీ.

శా॥ నీరూపంబునుతింప శక్యమగునే నీపాదపద్మంబులుఁ।
సోఁకఁ రాయి యహల్యయయ్యెఁబృథివిఁ సీతేశనీమోహ
నా। కారంబీయెడనాకుఁజూపగదవే కాకుత్స్థవంశోద్భవా।
మారాకారయటంచుఁగొల్చెదను రామా జానకీనాయకా.

శా. నీపాదాంబుజయుగ్మముఁ దలచెదఁ నీకీర్తనల్పాడెదఁ
గోపాలా యదునందనా యనుచు నీకుఁ బ్రమొక్కెదఁ
భక్తితో। నీపేరం బనిచేయుచుఁ గరములఁ నిన్నింక
బూజించెదఁ।మాపాలం గరుణింపవేయెప్పుడు రామా.౨౦

మ. జననంబై యిహలోకసౌఖ్యములచే సంతోషచిత్తుండనై
ఘనసంసారపయోధిలోమునిఁగి కాంక్షల్నిక్కలై మూ
ఢతఁ।నినునెంతైనదలంపలేని నరుడఁ, నీచస్వభావుండ
నై। మనుచున్నాడను యేమిజెప్పవలె రామా జానకీ
నాయకా. ౨౧

మ. హరి గోవింద ముకుంద కృష్ణ జగధాధారాహిపర్యంక
యీ। శ్వర గోపాలక చక్రహస్త కమలేశా రామ నా
రాయణా। మరలోకేశ జనార్దనా భవహారా మౌనీంద్ర
సంసేవితా।మరుపెంతైనను రాదు నీమహిమ రామా.౨౨

మ. వృథగాజేయకు నాదుమొఱ్ఱవిను నిన్వేడఁ పరాకా ద
యా। నిధివంచుఁ బహునమ్మినానిపుడు నన్నిట్లేచగా

న్యాయమా। విధిరుద్రామరవంద్య నీశరణు రావే నన్ను
రక్షింపవే। మధుసంహార భవత్పదాశ్రయుడ రామా. ౫౩
మ. బలిపాతాళముకంటద్రొక్కిన భవత్పాదంబురాకుండెనో।
అలపాషాణమువిూది పాదమిపుడున్నట్లుండెనో గాక నీ।
విలసత్పాదములేలజూపవయ నీవేదిక్కునాకంటి ను।
మ్మలికన్ బెట్టక యిమ్ము వేవరము రామా. ౫౪
మ. నిను బ్రహ్మాదు లెరుంగలేరనిన చో నేనెంతవాడన్ నినున్
గన నజ్ఞానుడ మూఢుడన్ జడుడ లోకస్తుత్య నీపాద
చిం। తనగల్గం గరుణింపవే దయను నీదాసుండనై యు
ర్విలో। మనుదు నిన్ను దలంచుచు న్మదిని రామా. ౫౫
మ. తెలియన్ లేరు మహాత్మ నిన్ను మునులున్ దేవేంద్ర
రుద్రాదులే, వలనన్ నీపదపద్మముల్ దలచిరో వారెంత
యో శ్రేష్ఠులై, విలసత్కాంతులనొప్పియుండిరో నన్
వీక్షించి రక్షింపు నే, మలినస్వాంతుడగాను దాసుడను
రామా జానకీనాయకా. ౫౬
శా. శ్రీనారాయణ రాఘవేంద్ర కరుణాసింధుండగోపాలకా।
నీనామామృతసారమీయగదవే నీపాదభృత్యుడనై
నానాపాపచయంబు బాసెదను గానన్ మోక్షంబీయం
గదే। మానాథా శరణంచు వేడితిని రామా. ౫౭
మ. గురువై దేవుడవై సనాతనుడవై కోదండహస్తుండవై
కరుణానీరధివై జగన్నుతుడవై కౌసల్యపుత్రుండవై
నెరి నాతల్లివి తండ్రివై బరగుచున్ నిత్యంబు నన్బ్రోవవే
మరుగు ల్బెట్టకు నిన్నె నమ్మితిని రామా. ౫౮

శా. నాపాలన్ గృపగల్గి దొడ్డదొరవై నాతల్లివై తండ్రివై
నాపుణ్యంబులరాశివై ఘనుడవై నన్నాచుదైవంబవై। నా
పాపాపహమూర్తివై సముడవై నాపెన్నిధానంబవై
మాపాలన్ గరుణించి బ్రోవగదె రామా జానకీనాయకా. ౫౯

మ. ఘనసంసారపయోధిదాటుటకుమార్గంబేదియో వేగనేఁ
గనగా జేయఁగదయ్య యింకెవరు నన్నావంగ నీవయ్య ని
న్ననయంబున్ భజియింతునయ్యమరినీ కాత్ముండ నేనయ్య నీ
మనసుంబెట్టగదయ్య నాగతికి రామా జానకీనాయకా. ౬౦

మ. అరిషడ్వర్గములన్ జయించిసుఖినై యాత్మన్ నినున్ గొల్చినా
దురితంబుల్ హరియించితిన్ సకలదుర్దోషంబులన్ బాసితిన్
హరినీదానుడనైతి నింక మది నీధ్యానంబుగావింతు క్ర
మ్మరజన్మంబులనొందకుండగను రామా జానకీనాయకా.

మ. హరు శైలాత్మజ నాంజనేయు ధ్రువు నయ్యక్రూరునిం
వ్యాసునిన్, గరినిన్ భీష్ముని నారదున్ బలి శుకున్ ఘం
టాశ్రవున్ ద్రౌపదిన్, నరు బ్రహ్లాదు విభీషణుం గొలు
తునో నారాయణాయంచు వే, మరు నీనామము బాయ
కుండుదును రామా జానకీనాయకా. ౬౨

మ. గతినీ వేయనినమ్మియుంటియిదియేగంటిన్ మరేచందముల్
మతిహీనుండనఁగాన నేనెరుగ రామా నామనఃపద్మమం
దతికారుణ్యముతోడనిల్వగదె మోహాంధ్యంబులన్ బాసినే
మతిమంతుండనునొచునిన్గనుదు రామా జానకీనాయకా. ౬౩

మ. స్థిరతన్ ధ్యానముసేయుసన్మునులకుం జిత్తాబ్జభృంగంబునై।
పురుహూతాది సమస్తదేవతలకున్ బూజింపముఖ్యంబునై

పరగెన్ నీపదపంకజద్వితయమో పద్మాక్ష నీసాటికిన్
మరియే దైవములేదు యెంచగను రామాజానకీనాయకా.

శా. రామా నీదయకేనుపాత్రుడను రారా వేగ నన్నావరా
నీమాయల్గనలేనురా దెలుపరా నీకేనుభక్తుండరా । కా
మాంధుండనుగానురా నిజమురా కౌటిల్యమింకేలరా
మా మీదం గృప యుంచరా శరణు రామా జానకీ
నాయకా. ౬౫

మ. జననంబందియు వృద్ధిబొంది పిదపన్ సంసారకృత్యంబు
లం । దనియంజేసితి చాలు నింక హరి నీదాసుండనై భక్తి
తో । జనలోకంబున నీదుకీర్తనసుధాసారంబునే గ్రోలెదన్
మనసుంబట్టి హరించు నాయఘము రామా జానకీ
నాయకా. ౬౬

మ. హరి నావిన్నపమొక్కటైనవినవయ్యా పూర్వకాలమ్ము
నన్ । కరి మొఱ్ఱెట్లు వినంగనోపితివి గంగానందనుం
డట్లు నీ । శరణుంజొచ్చిన నెట్లుబ్రోచితివి యాచందంబు
లట్లుండన । న్మదినిభ్భంగిని జూడవచ్చునయ రామా
జానకీనాయకా. ౬౭

మ. తగదా నాకభయంబునిచ్చుటకు నేదాసుండనయ్యుండఁ
గాఁ । దగునా కంసవిదారి నన్నువిడ నా తప్పేదియో
జెప్పుమా। పగలున్ రాత్రియు నిన్ను నేదలతు నాభావం
బునన్ భక్తితో । మగుడన్ నాయెడ పంతమేమిటికి
రామా జానకీనాయకా. ౬౮

మ. జపముల్ సల్పఁగలేదు పుణ్యనదులం జేరంగఁబోలేదు నే।
నుపవాసంబులనుండలేదు వినుమా యుష్మత్పదాంభోజ

మే । నెపుడున్ నాహృదయంబునన్ నిలిపి నిన్నేగొల్తు దైత్యౌఘభీ । మ పరా కేమిటికయ్య నాయెడను రామా జానకీనాయకా. ౧౯

మ. పతినీవే గతినీవె నాదొరవునై పాలించగానీవె నన్‌।మతి మంతుందగజేయ నీవె దయతో నన్నేలగానీవె న।న్నతి ప్రేమంబున బ్రోవ నీవెపుడు నాయాత్మ్ముండవున్నీవె నా । మతిలోనిల్చినవాడవీవెకద రామా జానకీనాయకా. ౨౦

శా. పుట్టింపంగను వృద్ధిజేయఁగ, లయంబున్ సల్పగానీవె నీ గుట్టున్నామ్నాయలుగాన లేరు విధియుం గూఢంబుగా ప్రేకవు లన్ । బట్టించేమియొనర్చె చక్రధర నన్బాధించు పాపంబు లన్ । మట్టించీయగదయ్య పుణ్యములు రామా జానకీనాయకా. ౨౧

మ. మది నేనొక్కటిగంటి భక్తుల యెడన్ మన్నించుచందంబు నే।నదియుంజెప్పెద నంజనీసుతుని బ్రహ్లాదుం బలిన్ వ్యాసుఁడ్రౌ।పది నక్రూరు విభీషణున్ విదురునిం బ్రఖ్యాతిగా గావవా । మదియందున్ నను నట్టుజూడు మిక రామా జానకీనాయకా. ౨౨

మ. ఉడురాడ్జూటశరణ్య శేషశయనా యుత్కృష్టకీర్తిప్రభా। విడిపోనేరవు పూర్వజన్మఫలముల్ వేధించునంచు న్భయం। పడి నీపాదసరోజముల్ దలచి నీభక్తుండనై తింగదా । మడియంజేయుము నాదుపాపములు రామా జానకీనాయకా. ౨౩

మ. భ్రమలు న్నాకు మరేమిలేవు యిక నీపాదాబ్జముల్ గొల్వగా । భ్రమయే యొక్కటిగన్నవాడ నటులన్ పాత్రం

డనై యుండెదరఁ । సమబుద్ధిఁ నినువేడెదఁ మునమునఁ
సంతోషినై యుండు నా । మమతల్ద్దీర్పఁగనీవ యింకెవ
రు రామా జానకీనాయకా. ౭౪

మ. దిననాథాయుతకోటితేజ దివిజాదిత్యాదిసంస్తుత్యస ।
న్మునిచిత్తాబ్జనివాసభక్తజనసమ్మోదాంఘ్రిపద్మద్వయా ।
నినునేనెప్పుడు రామరామయనుచుఁ నీయందు సద్భక్తితో ।
మనమందుంభజియింతు గావఁగదె రామా జానకీనాయకా.
౭౫

మ. సిరికిఁ భర్తవునై సురాధిపులకుఁ సేవింప దైవంబవై । హర
బ్రహ్మాదులెరుంగరాని బహుమాయాత్ముండవై నీవుయీ ।
ధరణింబుట్టుచు దుష్టులందునుముచుఁ ధర్మంబులంనిల్పు
చుఁ । మరియాశ్చర్యముగా నటింతువయ రామా జాన
కీనాయకా. ౭౬

శా. కంటిఁ నీపదపద్మము ల్మనములో ఖండించితిఁ పాప
ముల్ । వింటిన్ నీసుచరిత్రముల్మ్మదముతో వైరిఁ విడం
గొట్టితిఁ । బంటఁ నిన్ను మనంబునం దలచుచుం ।
భావించి మేల్గాంచుచుం । మంటి న్నీదయ జెప్పగావశమె
రామా జానకీనాయకా. ౭౭

మ. వరగర్వంబున నష్టదిక్పతులనుఁ వంచించి కైలాసముఁ ।
గరముల్నాచియునెత్తినట్టి ప్రబలుఁ గర్వాంధునిఁ రావ
ణుఁ । సురసంఘుంబులు మెచ్చ ద్రుంచితివి నీశౌర్యత్వముఁ
బల్కఁగా । మరిబ్రహ్మదులకైన జొప్పడున రామా జా
నకీనాయకా. ౭౮

మ. అతిభక్తిన్ నిను నెంతగానుతులు నాయాత్మన్ దగన్ జే
యగా। మతినింబెట్టవుయేమియుంచనవు నమ్మన్ లేవ నా
యందునన్ । గతినీవేయని యంటిగాదె యెపుడున్ గా
రుణ్యమున్ గల్గి నా । మతిలోనిల్చి కృతార్థుఁ జేయగదె
రామా జానకీనాయకా. ౭౯

శా. క్షీరాంభోధివిహార సర్వసుమనశ్చిత్తాబ్జసంచార శృం ।
గారాకార సుమేరుధీరగిరిరాడ్గంభీర సద్భక్తమం। దారాం
భోధిసుతాత్మదార, పరతత్త్వాధార నీకీధరన్ । మూరి
వ్వారిక నీవెకర్తవయ రామా జానకీ నాయకా. ౮౦

మ. వనజాతప్రభవామరేంద్రనుత దేహా సర్వభూతాదిరా ।
ద్భవకోదండవిఖండనా! సకలపాపధ్వంస దైత్యాంతకా ।
వినవే యార్తజనావనా ! యనుచు నేవిజ్ఞాపనల్ సేయఁ
గా । మనసుంబెట్టక యుండుటేమిటికి రామా జానకీ
నాయకా. ౮౧

మ. ఇక నే నెట్టులనిందలంతు హరి నన్నీవేమిగా జేసెదో।యొక
మార్గంబిడియుంచు జెప్పదగదే యోదేవ నీదాసుడన్ ।
అకటా నాకభయంబులిమ్ము కరుణాత్మా నీవెనాదిక్కు
యా । మకరాక్షాసురప్రాణనిర్దళన రామా జానకీ
నాయకా. ౮౨

మ. మధురంబుల్ విడి చేదుగోరుకరణిన్ మర్త్యావళుల్ వెఱ్ఱు
లై । వృథ దైవంబులగొల్చుటేమి ఫలమో వేమారు
నిన్వేడగా । నధికారంబున మోక్షమిచ్చుటకు దేవా నీ
వెదైవంబవో ! మధువైరీ యికమాటలేమిటికి రామా
జానకీ నాయకా. ౮౩

మ. కనకగ్రావము మందిరంబు కలుము ల్గన్నమ్మ యిల్లాలు
స । ద్ఘవతన్ సృష్టియొనర్చువాడు సుతుఁడున్ తద్దేవతల్.
భృత్యులున్ । మునులున్ భక్తులు శూలి మిత్రుఁడనగా
ముఖ్యుండవై కర్తవై । మనసావ్వన్ ప్రభువై నటింతువ
య రామా జానకీ నాయకా. ౨౪

మ. సుధ జన్మించిన తోడనే వనితవై శోభిల్లి దైత్యే
శులున్ । వ్యథజెందన్ సురబృందము ల్దనియ సేవావేళ
పీయూషము । త్యధికంబొప్పగబోసి రాక్షసుల గర్వా
టోపముల్ మాన్పవే। మధురంబుల్ భువి నీచరిత్రములు
రామా జానకీనాయకా. ౨౫

శా. నీరూపంబిదియంచు నెన్నదరమౌనే యేరికిన్ ధాత్రిపై
వీరాగ్రేసరు డర్జునుం డతనికీవే చూపవే రూపమున్
యేరూపంబని రూఢిలేక మదిలో యీశా పరబ్రహ్మ
యో। మారారీనుతయంచు మ్రొక్కెదను రామా జానకీ
నాయకా. ౨౬

మ. కరిపట్టణంబున కేగి కౌరవులతో కార్యానుకూలంబుగా ।
కురురాజోద్దను ధర్మరాజువలుకుల్ గొన్నిం దగంజెప్పి
వన్ । చెరుపుల్ జెప్పితివంచు నీయెడను దుశ్చేష్టల్దలంపన్
సభన్ । మరినీయద్భుతరూపుజూపితివి రామా జానకీ
నాయకా. ౨౭

మ. అరయన్ పార్వతిప్రాణనాధునకుమస్తాగ్రంబునన్ రత్నమై
వరమానీశ్వరభక్తబృందమునకున్ భాసిల్లుమోక్షాంకమై
గరిమన్ సాయకశాయికింజననియైగన్పించుమున్నేటికిన్
మరిపుట్టిల్లగు నంఘ్రులం దలతు రామా జానకీనాయకా.

మ. పతినీవేయని నీదునామపఠనన్ బాటించి దత్సారముం
సతతంబున్ రుచిపుట్టజుత్తెసను నానంకల్పము ల్దీర్చుమీ
సుతులున్మిక్కిలిచేయునేర నెపుడున్ నోయూరమీకీర్తనాలీ
మతినిల్పెను బఠించుచుండెదను రామా. ౮౯

మ. హరి నీపాదసరోజముల్ సతమునాయాత్మన్గనన్ జేసెదన్
నెరినాకష్టములెన్నడున్ దరుగునో నేనెట్లునిన్గాంతునో
కరుణాసింధుడ చెప్పవే దయను లోకస్తుత్య లక్ష్మీశ యే
మరకే నెప్పుడు నీకుమ్రొక్కెదను రామాజానకీనాయకా.

మ. హరి శ్రీకృష్ణ ముకుంద చక్రధర కంసారాతి వైకుంఠమం
దిర గోపాలక నందనందన రమాధిష్టానలోకేశ్వరే
శ్వరగోవిందమురారిశౌరియనుచున్ భక్తిన్ నినుంగొల్చునీ
మరుగుంజొచ్చితినయ్య కావుమిక రామా జానకీనాయకా,

మ. ఖరునిన్ద్రుంచి కబంధునిం దునిమి లోకద్రోహియౌ రా
వణున్ శరజాలంబులపాలు జేసి త్రిశిరున్ శాసించి దైత్యా
ళినం దక దున్మాడియు లోకము ల్మోదమునొందం జేసి
తీవేకదా మరువుల్ రావు భవత్ప్రతాపములు రామా
జానకీనాయకా. ౯౨

మ. ఇక నెన్నింటికి నిన్ను నేవదల నాయిచ్ఛన్ దయాళుండవై
అకలంకుండను నీకుభక్తుడను నీయాత్మన్ సదాగొల్చెదన్
శుకభంగిన్ గృపగల్గినిశ్చలత నన్నుంగాచి రక్షింపవే
మకరిం ద్రుంచి కరీంద్రుగాచుక్రియ రామా జా. ౯౩

మ. అదితీనందనులున్ విధాత మునులయ్యామ్నాయముల్
రుద్రుడున్ విదితంబొప్పగ గానలేరనగ నిన్నేడంగ నా

శక్యమే। చదువుల్నేరను మానవాధముడ నాశక్త్యానుసా
రంబుగా। మదిలో నెప్పుడుగొల్చుచుండెదను రామా జా.

మ. కరినేలాగున గాచినావొ ధృవుకాంక్షల్ దీర్పుటెబ్బంగియో
నరువాంఛావళి నెట్లొసంగితొ బలిఁ నాడెట్లురక్షించితో
యెరుఁగఁ దద్దయస్వామినాయెడను నీవిట్లువిచారించుటల్
మదినింకాదరణంబులేకునికి రామా జానకీనాయకా. ౯౫

మ. అహితల్పా ఖగవాహనా యసురసంహారా దయాసాగ
రా। తుహినోర్వీధరజార్చితా నిగమసంస్తుత్యా జగద్రక్ష
కా। విహగేంద్రధ్వజ చక్రహస్త వరదా విప్రాళిసంసేవితా
మహిపుత్రీధవ భక్తవత్సలుడ రామా జానకీనాయకా ౯౬

మ. అధికాశ్చర్యము నీచరిత్రములు సర్వాధీశ కీశాళి యంబుధి
బంధించుట లంకకుం జనుటయుం పూర్వామరాధీశులం।
పృథివింగూల్చుట చోద్యమయ్యె నిటు లే పృథ్వీశులుం
జేసిరే। మధువిధ్వంస మహాత్మ నీకెతగు రామా జానకీ
నాయకా. ౯౭

మ. కమలేశా వనమాలి కృష్ణ హరి లోకారాధ్య శ్రీరాఘవా
కమలద్వేషణ కోటిపూర్ణవదనా కంజాక్ష మీపాదయు
గ్మము హృత్పద్మమునందు నిల్పితిని రమ్మా నన్ను
రక్షింప నా। మమతల్ దీర్పుము నీకటాక్షమున రామా
జానకీనాయకా. ౯౮

మ. కలదన్నంతనె యుక్కుకంబమున గల్గఁ లేదనీరూపు నా
పలుకుల్ యేల వినంగరావు చెపుమా పాపఘ్న నీకిట్లు
భ। క్తులయందుఁ వలపక్షముల్దగునె నాకోర్కెల్ ప్ర

సాదించి ని । ర్మలచిత్తంబున నన్నుఁగాచకొను రామా
జానకీనాయకా. ౯౯

శా. ఏనైతే నిను నమ్మినాఁడ నిక నన్నేలాగునన్ గాచెదో ।
నేనెవ్వారిదలంపలేదు నిజమే నీదాసుఁడన్ దీనుఁడన్ ।
నీనామస్తుతులాచరింతు మదిలో నీధ్యానముం జేసెదన్ ।
మానారీ హృదయేశ నిన్మరువ రామా జానకీనాయకా.

శా. అయ్యా రాఘవరామచంద్ర రవివంశాంభోధిశీతాంశునా
కుయ్యాలింపగదయ్య భక్తజనులం గూర్మిందయన్ బ్రోవ
నీ । వయ్యా దైవమటంచు వేదచయము ల్వర్ణింపవే ని
న్నయ్యే । మయ్యానాకభయంబులియ్యవయ రామా
జానకీనాయకా. ౧౦౧

మ. పదధూళిన్ శిల నాతిజేయుచు మహాభవ్యప్రకాశుండ
వై । కదనక్షోణిని రావణాద్యసురులంఖండించు వీరుండ
వై । మదిలో నిన్నుదలంచు భక్తులను సంభావించు దై
వంబవై । మదియుప్పొంగ జగంబులేలుదువు రామా
జానకీనాయకా. ౧౦౨

మ. సతులం బుత్రుల భ్రాతలం బ్రియముచే సఖ్యంబునన్
భ్రామికల్ । మతినింబెట్టగలేదు నీచరణపద్మంబు ల్మ
దిం జేర్చితినో । పతితత్రాణయటంచు నీకృపకు నేపాత్రుం
డనై యుంటి సమ్మతితోడన్ ననుగావుమీదయను రామా
జానకీనాయకా. ౧౦౩

శా. శ్రీరామా సురసేవితాంఘ్రియుగళా సీతామనోనాయకా
పారావార విహార భక్తవరదా పద్మాక్షలోకేశ్వరా

వీరాగ్రేసర రావణాంతక జగద్విఖ్యాతిగా నాయెడన్
మారుంబల్కక యిమ్ము సద్గతిని రామా జా. ౧౦౪

శా. రావే నారదసన్నుతా రఘువరా రావే జగన్నాయకా
రావే నీవనినమ్మినాడ దయతో రావే ననున్ గావవే
రావే నీకు నమస్కరింతు నెపుడుం రావే దయాసాగరా
మావెన్నుండవు నిన్ననమ్మితిని రామా జానకీనాయకా.

శా. నేనీదాసుడనైతి నాయఘములం నిర్జించి మీపాదము
ల్గానంగోరితి నిమ్ము నాకు వరము న్గావం దయాదృష్టిచే
శ్రీనాథా నను నేలవయ్య వరదా చిద్భావసర్వేశ నా
మా నాచిత్తమునందునిల్పితిని రామా జానకీనాయకా.

మ. అనిశంబున్ భవదీయనామచరితంబైనట్టి యీపద్యము
ల్వినినన్ వ్రాసిన బల్కినన్ దురితముల్విధ్వంసమైపోయి
శో| భనసౌఖ్యమ్ములు నబ్బుపుణ్యములునుం బ్రాప్తించు
నెవ్వారికిన్| మనమందుం దృఢబుద్ధినిన్ దలప రామా.

మ. ఘనుడౌ శీతనమంత్రికిం దనయుడం గౌండిన్యగోత్రుండ
న| జ్ఞనుడన్ మాటురి వెంకటాఖ్యుడ కవుల్ సంతుష్టులై
మెచ్చగా| ననఘా నే రచియించితిన్ శతక మిట్లత్యంత
భక్తిన్ దగన్| మనసొప్పన్ భవదంకితంబుగను రామా
జానకీనాయకా.

